# గీతావాణి

39




నాల్గవ సంవత్సరము

మూడవ సంచిక

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ గీతానంద.

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా

15 సెప్టెంబరు 1954

# విషయసూచిక - సెప్టెంబరు '54.



## చందాదార్లకు విజ్ఞప్తి.

చందాలు ముగిసినవారు, తమకు పత్రిక అవసరము లేనిచో, ఆవిషయమును కార్డు వ్రాసి మాకు తెలియజేయండి. కార్యాలయమునకు ఆ మాత్రము ఉపకారము చేయగలరని ఆశించుచున్నాము.

పత్రిక సరిగా చేరకున్నను, అడ్రెసు వ్యత్యాసముగ నున్నను, ప్రతులు యెక్కువగా వచ్చుచున్నను — గీతావాణికి సంబంధించిన మరియేవిధమైన ఫిర్యాదులనుకూడ 'మేనేజరు — గీతావాణి ఆఫీసు — ఆళ్ళగడ్డ పోస్టు, కర్నూలు జిల్లా'. అని వ్రాయండి.

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు
గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



మేనేజర్:

[illegible] శ్రీ [illegible]

గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

సంవత్సరచందా 4—0 0. ※ విడి పత్రిక 0—6—0

15th SEPTEMBER 1954.

# ఆంధ్ర సోదరులకు విన్నపము.

గీతాతత్త్వ సందేశమును ఆంధ్రభూమి నల్గడల పరివ్యాప్తమొనర్చుటకై 'గీతావాణి' మాసపత్రిక యథాశక్తి పరిశ్రమించుచుండుట మీ రెరిగినదే. సర్వానర్థకారణమగు అజ్ఞానమును పటాపంచలొనర్చి నరునిలో దాగియున్న నారాయణశక్తిని ప్రజ్జ్వలితమొనర్చుటకు గీత వంటి సులభ సుందర మహోత్తమ సాధనము మరొక్కటి లేదనువిషయము మీకు తెలియనిదికాదు. అట్టిఅమూల్య తత్త్వరత్నాకరమగు భగవద్గీతలోని భావములను విభిన్నభంగుల ఆంధ్రావనియందు ప్రచారమొనర్చుటకు ఏకమాత్ర పత్రికగ విలసిల్లిన గీతావాణికి స్వయంపోషకశక్తి లభించునట్లు విస్తారముగ చందాదారులు లభించకుండుట చింతింపదగిన సంగతి. గీతవంటి గంభీరవిషయమును చదువు ఉచ్ఛస్థితి తెలుగుదేశమునకు లేదేమో! అయినను, చారిత్ర్యాత్మకమగు తెలుగువారి మూలశక్తియందు మాకు అపారమగు విశ్వాసముకలదు. తమకై కష్టపడువారిని ఆదరించి ఉద్ధరించెడి ఉదారబుద్ధి వారికి సహజముగ కలదని మేము నమ్మియున్నాము.

మా నమ్మకమును బలపరచుచు కొందరు సోదరులు ఆలస్యముగనైనను తమ చందాలను పంపి యీ కార్యమునకు చేయూత నొసగుచున్నారు. వారికి మా కృతజ్ఞతలు.

కొందరు ఆత్మసోదరులకు మేము మనవిచేయునదేమనగా— చందామొత్తము ముగిసినవారు వెంటనె తమచందాను కార్యాలయమునకు పంపండి. అటుగాక పత్రిక మీకు అక్కరలేనిచో ఆవిషయమునైనను ఒక కార్డుద్వారా తెల్పండి. మీరు ఏ విషయమును తెల్పనిచో, చందాదారులు కాగలరను ఆశతో పత్రికను పంపుచుందుము. కార్యాలయమునకు ఆవిధమగు నష్టమును కల్గింపకుందురని వేడుకొనుచున్నాము.

మేనేజరు,
గీతావాణి కార్యాలయము.



సంపుటి 4 స్వస్తిశ్రీ జయ – భాద్రపదమ్. సంచిక 3

## బుద్ధియోగము.

గీత ప్రసాదించిన వరదానములలో బుద్ధియోగము అసమానమైనది. మమత్వమును వదలి సమత్వపూర్వకముగ కర్మను చేయుట బుద్ధియోగముయొక్క అభిప్రాయము. విషయములకై దేబరింపక ఆశలను ఆసక్తులను దూరముచేసి కర్మయొనర్చుట బుద్ధియోగమునకు ధ్యేయము. సుఖదుఃఖములలో – లాభనష్టములలో – బాగోగులలో, సమభావముకల్గి – బ్రహ్మభావముకల్గి కర్మలలో ప్రవర్తించుట బుద్ధియోగమనబడును. మనోబుద్ధులకు సామరస్యముపొసగి, చిత్తమునందు సమత్వము నిర్భరమైయున్నపుడు బుద్ధియోగము ప్రాదుర్భవించగలదు.

బుద్ధితో పొత్తుకుదిరినపుడే కర్మము వీర్యవంతమై రాణించును. సర్వశుభములకును సన్నివేశమప్పుడే లభించగలదు. బుద్ధియోగముద్వారా తృణమంతటికర్మ బ్రహ్మాస్త్రమై విలసిల్లును. బుద్ధియోగములో శాస్త్రజ్ఞానమునకును పురుషార్థకర్మకును సత్య శివ సుందరమైన సంయోగము లభించును.

ఎప్పుడు యేవిధముగా యేమిచేయవలెననునది మానవున కొక గడ్డుసమస్య. బుద్ధియోగ మీసమస్యను సులువుగ విడమర్ప జాలును. పరిస్థితులను అదుపులో పెట్టుటకొరకు యింద్రియాలను నిగ్రహించుకొరకు శమదమాదులను సాధించుకొరకు బుద్ధియోగ సహాయము తప్పనిసరి.

రాగద్వేషాది వికారములతో సంకులపంకిలమైయుండు కర్మ యెంతెంతగొప్పది కానీకాక; దానికి మాన్యతలేదు. దోషభూయిష్ఠ మైన కర్మలఫలితము దోషమయముగనే యుండకపోదు. అట్టి వాటివలన ప్రపంచమునందు దుఃఖవైషమ్యదరిద్రములు విస్తారము కాగలవు. వాసనామయమైన కర్మ, మస్తిష్కమును హృదయమును మలినముచేయగలదు. బుద్ధియోగరహితమైన కర్మలో విచారశక్తి లోపించును. జీవనసమస్య క్లిష్టమైపోవును. కర్తవ్యకర్మ గుది బండవలె భారభూతమై తోచును.

ప్రపంచముండువరకు — జీవితముండువరకు మనుష్యుడు కర్మను చేసియేతీరవలెను. చేసేకర్మలో సుఖశాంతులు లభించవలె ననిన బుద్ధియోగ సహకారము అత్యగత్యము. బుద్ధియోగమునవలం బించి కర్మచేయువానికి పతనభయమనునదిలేదు. బుద్ధియోగమును ఆశ్రయించి కర్మచేయాలని గీతయొక్క సర్వోత్తమ సందేశము. "ధనంజయా! బుద్ధియోగమును శరణుబొందు"మని (2-49) గీతా చార్యుడు అర్జునునికి ఆదేశమొసగినాడు. మనసాధనలన్నియు బుద్ధి యోగమునందు పర్యవసింపవలసియుండును.

జ్ఞానధనమును — యశోధనమును — తేజోధనమును సంపాదింపగోరెడి మనము అవశ్యము బుద్ధియోగము నాశ్రయింప వలయును; సుకృతదుష్కృతరూపమగు కర్మకుండములో బ్లాటింగు పేపరువలెగాక, తామరాకువలె ఉండనగును; జగన్నాటక రంగము పై తాను పాత్రధారిననిగుర్తించి 'నిమిత్తమాత్ర'మై వర్తించదగును. ఈ బుద్ధియోగము గీతకు కంఠాభరణము.




( గత సంచిక 8వ పేజీ తరువాయి )

భగవంతుడు కర్మములను గుణములను అనుసరించి నాల్గువర్ణములను సృజించియున్నాడు. ఎవరియందు యే గుణము ప్రధానముగ నుండునో, కర్మవ్యాపారము యే విధిగనున్నదో, వాటి ననుసరించి నాలుగు వర్ణములను నిర్మించియున్నాడు.

వర్ణవ్యవస్థ సృష్టిసంచాలనమునకు అతి ఆవశ్యకమును, మహత్త్వపూర్ణమునునగు విషయము. వర్ణవ్యవస్థవలన మనుష్యుడు తనకు అభిరుచియగు కర్మ నొనర్చుచు పూర్ణత్వమును పొందుటకు అనుకూలము గలదు. ప్రతివాడును తన సంస్కారమునకును, అభిరుచికిని యోగ్యమగు కర్మయందు నేర్పు చూపగలడు. బ్రాహ్మణుడు తన సాత్విక గుణములద్వారా బ్రహ్మతత్త్వము నన్వేషించుచు ప్రపంచమున ఆధ్యాత్మిక నైతిక చారిత్రకముగ ప్రగతి జీవనమును ప్రేరేపించగలడు. క్షత్రియుడు రాజనీతిని శాసనవ్యవస్థను ప్రభుమంత్రోత్సాహశక్తులను అవలంబించిధర్మమును రక్షించెడి ధ్యేయముతో, అసహాయదీనదుర్బలులకుసాయపడగలడు; దుష్టులను దండించగలడు. వైశ్యులు సత్యబద్ధులై తమ వ్యాపారముతో ఆహార పశుసంపదను వృద్ధి నొందించుకొనగలరు. శూద్రులు సేవాకర్మములనాశ్రయించి ప్రపంచ శ్రేయస్సుకు పునాదులువేయ గలరు. ఇట్లు వారువారు ఆయావిహిత విధాన కర్మల నాచరించుచున్నచో, సమాజము సర్వతోముఖ వికాసమును బొందగలదు. ఆ వ్యవస్థిత సంఘటనవలన కార్యవిభజనయు చేకూఱగలదు. ఈవర్ణవిభాగమనెడి యేర్పాటు భగవంతుడు భారతదేశమునకు స్వయముగనిచ్చిన వరదానము.

నేటికాలమున యీ వర్ణవ్యవస్థ మానుటకును పూనుటకును గాక ఒక గళబద్ధ సమస్యయై కూర్చున్నది. ఈ వర్ణజాతి విధానము కేవలము జన్మముననే సిద్ధాంతము చేసినచో భారతీయ సమాజమున నెన్నో అవకతవకలు — లోపదోషము లుప్పతిల్లగలవు. ఈనాడు బ్రాహ్మణ జాతియందు పుట్టినవారు కొందరు జూదము, వ్యభిచారము, త్రాగుబోతుతనము, నీచసేవ మొదలగు యెంతో నీచమగు కార్యములకు ఒడిగట్టుట చూచుచున్నాము. శూద్రులనబడువారిలో దైవికమగు సాత్త్వికవర్తనము కలవారి నెందరినో మనము కన్నులార చూచుచున్నాము. అట్టియెడ వర్ణవ్యవస్థ జన్మముచేతనే నిర్ధారణచేయుట యెట్లు సమంజసమగును?

పరిస్థితి యిట్లున్నను — వర్ణవిధానము బొత్తుగా పనికిరానిదని చెప్పుటకు వీలులేదు. ఒకే ఒక మనుష్యుని శరీరమందు ఆలోచించుటకు మెదడుండవలెను. యోగక్షేమముల సాధించుటకు బాహువులుండవలెను. దేహమంతటికిని పంచవలసిన ఆహారరసమును సేకరించుటకు కడుపుండవలెను. శరీరభారమును మోసి నిర్వహించుటకు పాదములుండవలెను. ఈ పిండశరీరమందలి యీ అవయవములను వాటి గుణకర్మములనుబట్టి నాల్గు జాతులుగ విభజించునట్లు, మానవసమాజమనెడి విరాట్పురుషుని బ్రహ్మాండశరీరమునందు యీ నాల్గు విభాగములును ఉండక తప్పదు. విద్యా విచారములనెడి మస్తిష్కప్రధానములగు కర్మలను జేయువారిని బ్రాహ్మణులనియు, బాహుబలముతో — గుండెదిటవుతో పని చేయువారిని క్షత్రియు లనియు, ఆహారవస్తు సామగ్రులను వినిమయ మొనర్చెడివారిని వైశ్యులనియు, పైవారికి సర్వవిధముల సహాయ మొనర్చెడివారిని శూద్రులనియు, ఆయా గుణకర్మములనుబట్టి వర్ణభేదమేర్పడినది.

సత్త్వరజస్తమములనెడిగుణములు మూడువిధములు. సమత్వము, ప్రయత్నము, మందత్వము నను నవి క్రమముగ గుణములయొక్క స్వరూపములు. ఈ గుణముల తారతమ్యమునుబట్టి నాలుగువర్ణము లేర్పడినవి.

"అర్జునా! నేను అవ్యయమగు కర్తనైకూడ, అవ్యయమగు అకర్తనై కూడ ఉన్నాను." అని భగవంతుని మహోపదేశము. కర్త కర్మ

మొనర్చునెడ వానిశక్తి సన్నగిల్లియె తీరును. కర్మయనిన కర్తయొక్క శక్తిని వ్యయమొనర్చునదియె యని అర్థము. ఇట్లు శక్తి వ్యయమగుచు తద్ద్వారా ఫలసిద్ధి కలుగును. కర్మ యొనర్చి—పనిచేసి, తనశక్తిని వ్యయమొనర్చకున్నచో ఫలసిద్ధి కల్గుటకు మార్గములేదు. ఫలసిద్ధికోరువాడు కర్మచేయకతీరదు. కర్మచేసినవానికి శక్తి క్షీణించకపోదు.

ఇచ్చట భగవంతుడు "తాను అవ్యయమగు కర్త"నని సెలవిచ్చియున్నాడు. మనము వ్యయకర్తలము కర్మభారముతో మనకర్తృత్వశక్తి నానాటికి వ్యయమగుచున్నది. ఆయన అవ్యయకర్త. అంతె కాదు; అవ్యయమగు అకర్తకూడ. అకర్తయనిన కర్మ చేయనివాడను అర్థముకాదు. విశేషప్రకారమున కర్మచేయువాడని అర్థము. కర్మచేయబడుచుండియు ఆతనిశక్తివ్యయము కాదు. కాబట్టి ఆయన, విశేషప్రకారమున కర్మచేయువాడై యున్నాడు. ఆ విశేషప్రక్రియ మనకు లభించగలదా? మనుష్యుడు నిత్యతృప్తుడై, కామనా రహితుడై, ఆత్మయొక్క అకర్తృత్వమును దర్శించి కర్మను సదాచేయుచున్నను వానిశక్తి క్షీణించబోదు. అట్టివాడు కర్మచేయుచున్నను అవ్యయమగు అకర్తయై విలసిల్లగలడు. భగవద్గీతయందు నిష్కామకర్మమును ప్రతిపాదించుట కిదియె కారణము.

ఇక, అధ్యాత్మ దృష్టితో పరికించిన వర్ణవ్యవస్థ కేట్టి విలువయు లేదు. ఆ దృష్టియందు బ్రహ్మనిష్ఠతయె బ్రాహ్మణత్వము. అసత్పక్షమును విరోధించుటయె క్షత్రియత్వము. సదసద్విచార మొనర్పజాలెడి వ్యవసాయాత్మిక బుద్ధియె వైశ్యత్వము. కర్మనిష్ఠయు—సత్పాచరణమును శూద్రత్వము. మానవుడు పూర్ణత్వమును బొందుటకు యీ నాలుగు వృత్తులును అత్యావశ్యకములై యున్నవి. జ్ఞాని యనబడువానియందీ నాలుగు వృత్తులునుఅపరిహార్యములై ఉండవలెను. ఏ ఒక్కటి లోపించినను వానిపూర్ణతకు న్యూనతగ భావించవలెను.

(సశేషము.)

ఇంద్ర, గం

# శ్రీ భగవద్గీత
# మాధ్వభాష్యానువాదము

విద్వాన్ – శ్రీ ఘూళీ కృష్ణమూర్త్యాచార్యులు, బళ్ళారి.

(గతసంచిక 30 వ పేజీ తరువాయి)

## — :తొలినుడి: —

శ్రీ బ్రహ్మరుద్రాది సకల జగన్నియామకుండగు శ్రీకృష్ణుడు తనకు మిక్కిలి స్నేహపాత్రుడైన అర్జునుని నిమిత్తీకరించి ఈ ప్రపంచమునందలి సకల సజ్జనులు దుఃఖలేశము గూడ లేనివారై స్వరూపానందావిర్భావరూపమైన మోక్షమనెడి మహాపురుషార్థమును పొందవలెనను ఉద్దేశముతో శ్రీభగవద్గీత నుపదేశించెను.

శ్రీ గీతను విని, చెప్పి, చదివి, చదివించి, వర్ణించి, పూజించి, స్తుతించి, నమస్కరించి– కొనకు అనుమోదించి ఇహలోక సుఖములను పొందుటయేకాక జ్ఞానభక్తివైరాగ్యముల సంపాదించి దానివలన శ్రీ పరమేశ ప్రసాదలభ్యమగు మోక్షమును గాంచుచున్నారు. కాబట్టి సకల మాముక్షువులు దాని నాశ్రయించదగును.

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, గీత ఇవిమూడు ప్రస్థానత్రయములని ప్రసిద్ధి నొందియున్నవి. ఈ గ్రంథములకు త్రిమతాచార్యులు భాష్యాదులరచించి జనోపకారమొనర్చియున్నారు. అందు "గీత" కలికాలమహిమనుకూడ లొంగక గ్లానిచెందక సర్వజన సమాదరణీయమై వెలయుచున్నది. కాన నా మందమతి ననుసరించి యాంధ్రభాషలో నారోపినంతమట్టుకు శ్రీ మధ్వాచార్య, శ్రీ జయతీర్థ, శ్రీ రాఘవేంద్ర తీర్థాదుల గ్రంథముల సంస్కృతభాష తెలియని సజ్జనులకు జ్ఞానలాభము కలుగవలెననియు, నామనశ్శుద్ధి కొఱకును నిరూపించుకొనుచున్నాను. నీరక్షీరన్యాయము ననుసరించి విబుధులు విషయమును గుర్తించి స్వీకరింతురను విశ్వాసము నాకు గలదు.

శ్రీ గీతకు అధికారి, విషయము, ప్రయోజనము, సంబంధము నను అనుబంధచతుష్టయము కలదు కాన అదియెంతయు స్వీకారార్హము.

లోకమున నందరు తమకెల్లప్పుడు సుఖమే కావలెననియు, కొంచెముకూడ దుఃఖస్పర్శము వలదనియు వాంఛింతురనుట నిస్సంశయము. సుఖము రెండువిధములు – ఐహికము – పారత్రికము. దీనిలో ఐహిక సుఖము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను అనుభవించుటచే ధనదారా పుత్రమిత్ర గృహారామ క్షేత్రాది ద్రవ్యములద్వారా కలుగును,

పారలౌకిక సుఖముకూడ స్వర్గసుఖము, మోక్షసుఖమని రెండు విధములు. స్వర్గమున రంభాది స్త్రీసంభోగము, నందనవన విహారము, విమానాది యానగతి మొదలగు రీతులుగా సుఖమనుభవింపబడును. దీనికికూడ ఐహిక సుఖమునకువలె ఒక అవధియున్నది. తరువాత నది దొరకదు. కాన ఐహిక స్వర్గ సుఖములు అశాశ్వతములు, అల్పములు, నిస్సారములు. మోక్షసుఖమట్లుకాక కొనలేనిదై దుఃఖస్పర్శమేమాత్రములేనిదైయున్నది. కాన బుద్ధిమంతుడు మోక్షసుఖమునే సంపాదింప యత్నించును. మోక్షసుఖ మనుభవింపబడు దేశములు కొన్ని వైకుంఠాదులు కలవు. ఇతరుల గృహమున ప్రవేశించుట ఆ గృహపతి యాజ్ఞలేక ఎట్లుసాధ్యముకాదో అట్లే పరమాత్మానుగ్రహములేక వైకుంఠాది ముక్తిలోక ప్రవేశమునులేదు. కాన ఆ స్వామి యనుగ్రహము తప్పక సంపాదింపతగినది. శ్రీశుడన్ననో దర్శనమాత్రముననే ప్రసన్నుడగును. అనగా పరమాత్మయొక్క అపరోక్షజ్ఞానమే ప్రసాదకారణము కాన అదియే సంపాద్యము.

అపరోక్షజ్ఞానమునకు మొదటి సోపానము పరోక్షజ్ఞానము. ఈ పరోక్షజ్ఞానము వేదశాస్త్ర పురాణాదులచే కలుగును. మరల మరల సేవించుటచే ప్రభువు సుఖప్రదుడగునట్లు నిరంతరాఖండధ్యానముచేత శ్రీశుడు ప్రసన్నుడై అపరోక్షజ్ఞానము నిచ్చుచున్నాడు.

> "శాస్త్రేష్వియానేవ సునిశ్చితో నృణాం
> క్షేమాయ సమ్యగ్విమృశేషు హేతుః।
> అసంగ ఆత్మవ్యతిరిక్తవస్తుని
> దృఢా రతిర్బ్రహ్మణి నిర్గుణే చ యా॥"
>
> శ్రీ భాగవతము – 4 స్కం.

అన్నటుల, పరమాత్మయందు భక్తిని, అన్యవిషయములయందు విరక్తిని సంపాదించుటయే క్షేమము; అనగా మోక్షమునకు సాధనము. భక్తి అనగా మాహాత్మ్యజ్ఞానపూర్వకమైన, సుదృఢమైన, సర్వతోధికమైన స్నేహమే. కనుక మాహాత్మ్యజ్ఞానములేనిదే భక్తికలుగదు, జ్ఞానమా శ్రవణములేక కలుగదు. శ్రవణమిట్లు మోక్షసాధమునకు ప్రథమసోపానముగానున్నది. వేదశాస్త్రము లనంతములు – అర్థగాంభీర్యయుక్తములు. మనుజుడా, అల్పాయువు అల్పశక్తుడు – అల్పబుద్ధి బలముకలిగి అల్పధనవంతుడై వానిని చక్కగా తెలియ ననమర్థుడైయున్నాడు. కాన ఏది సకల వేదశాస్త్రములసారమో, సులభమో అది కోరబడి, సర్వజనమాన్యమగుచున్నది. "శాస్త్రేషు భారతం సారం – భారతే గీతికా వరా" (భారతము) కావున మహాకరుణానిధియగు భగవంతుడు కలియుగమునగూడ సజ్జనులు నరకాద్యనర్థంబులఁబొందరాదని ఉత్తమ మోక్షసాధనంబగు నీ గీతాశాస్త్రంబును శ్రీకృష్ణుడై ద్వాపరాంత్యభాగంబున రచించి తనకు పరమభక్తుడగు నర్జునున కుపదేశించెను. దానినే శ్రీ కృష్ణావతారుడగు శ్రీకృష్ణద్వైపాయనుడు భారతమున రచించెను. దీనినొక్కసారి వినుటచే సర్వపాప పరిహారమగుటయేకాక, సంసారమహాపానిష్ట

నివృత్తి, మోక్షరూపమగు ఇష్టప్రాప్తియు కలుగును. భారతాంతర్గతగీతయు నొక ఉత్తమ కావ్యము. కావ్యమున శ్లేష యమకాద్యలంకారము లుండునట్లే గీతలోకూడ కలవు. కొన్నియెడల పదచ్ఛేద వైచిత్ర్యముచేతను, అన్వయభేదమువలనను వారివారికితోచు అనేకార్థములు స్ఫురించు ఘట్టములు గీతలో లేకపోలేదు.

అందు 2 అధ్యాయము 11 శ్లోకమునుండి కొనవరకు శ్రీ కృష్ణార్జున సంవాదరూపమగు గీతోపదేశము వెలయుచున్నది. మొదటి అధ్యాయమును, 2 వ అధ్యాయమునందలి 10 శ్లోకములును, ఆ ఉపదేశమునకు ప్రసక్తిని నిరూపించుచున్నవి.

గీతకు అధికారి - అర్జునాది సకల సజ్జనులు; ప్రయోజనము - మోక్షాఖ్యపరమ పురుషార్థము; విషయము - సకల వేదశాస్త్ర పురాణాదిసారము.

ఇంతియగాక గీతకు వక్త్రానుకూల్యము, శ్రోత్రానుకూల్యము, ప్రసంగానుకూల్యములును గలవు. వక్త - సర్వజ్ఞుడు, వంచకత్వాది దోషములు లేనివాడు, నిరవద్యనిఖిల కళ్యాణగుణాకర దేహుడునగు శ్రీ కృష్ణుడు. శ్రోతయో - వక్తృప్రీతిపాత్రుడు, శ్రద్ధాళువు, ముముక్షువునగు అర్జునుడు. ప్రసంగమన్ననో - మోసము - పరిహాసము చేయుటకు తగని సమయమగు ధర్మయుద్ధారంభము. కనుక అన్నిరీతుల గీతాశాస్త్రము పరమప్రమాణము. మోక్షసాధనము, సకల సహృదయావధార్యము.

శ్రీకృష్ణుడు, అర్జునుడును సమవయస్కులు; బావమరిదులు. అత్యంత స్నేహితులు. కనుక గురుశిష్యభావమున కవకాశమే లేకుండెను. శ్రీ కృష్ణావతారము కేవలము బలకార్య నిమిత్తమేకాక జ్ఞానకార్యనిమిత్తముకూడ నగుటచే ఉద్ధవాదులకువలె - అర్జునునికిని జ్ఞానోపదేశ మొనర్చుటకై గీతను రచించి యుద్ధకాలమున నేర్పడిన అర్జునుని సందేహ నిరాకరణమును పురస్కరించుకొని - కలియుగమునగూడ జ్ఞానప్రసారమును మనస్సున నుంచుకొని కృష్ణరూపమున రచించి యుపదేశించి - అదే గీతనే వేదవ్యాసరూపమున భారత నిక్షిప్త మొనర్చెను.

ధృష్టద్యుమ్నుడు పాండవ సేనాపతికాని నిజమునకు భీముడే సేనానియై నడపించెను. "పర్యాప్తమిదమేతేషాం బలం భీమాభిరక్షితం" అని దుర్యోధనుడన్నాడు. కాని ధృష్టద్యుమ్నుని పేరుకూడ కైకొనలేదు. ఆ భీమునికి నియామకుడు సర్వేంద్రియ ప్రేరకుడగు హృషీకేశుడు. యుద్ధాజ్ఞ నిచ్చు శంఖపూరణ సమయమును చూడుడు. కౌరవ సేనాపతి భీష్ముడు శంఖము పూరించగానే పాండవులు - వారి సైన్యమును శ్రీకృష్ణునివంక నిరీక్షించి "పాంచజన్యమునా హృషీకేశుడు పూరించగానే తామును శంఖనాదములొనర్చిరి" అనుటచే శ్రీకృష్ణుడే పాండవ సేనానియంతే - అతడు గీతాశాస్త్రోపదేశము చేయుచుండ పరమాస్తికుడును, పాండవ పక్షపాతియు, శ్రీకృష్ణ భక్తాగ్రేసరుడగు భీష్ముడుమాత్ర మెట్లు యుద్ధాజ్ఞనిచ్చును? కాన గీతోపదేశ మేకాదశినాడు జరుగనిచ్చి మార్గశిర శుద్ధ త్రయోదశినాడే యుద్ధము ప్రారంభమైనది. సరస్వతీ పత్త్యాది

సకల దేవతానికరప్రభువును, సృష్టి, స్థితి, సంహార, నియమన, జ్ఞానాజ్ఞాన, బంధ మోక్షాది ప్రదుడును, సర్వజ్ఞ శిఖామణియు, అఘటిత ఘటనాసమర్థుడును నగు భగవంతు "డల్పకాలముననే గీతవంటి దుర్జ్ఞేయశాస్త్రము నెట్లు రచించి, యుపదేశించె" నన్నమాట యసమంజసము.

"న హి దేశాదిభిః కశ్చిద్విశేషః సముదీరితః ।
మనః ప్రసాదనార్థం హి దేశకాలాదిచింతనా ॥"

అనుటచే దేశకాలము లెట్లున్నను మనఃప్రసన్నతగలిగి జిజ్ఞాసువగు అర్జునుని కుపదేశింపఁబడిన గీత, రణరంగమైనను, యుద్ధారంభసమయమైనను విశేషపరిణామకారిగా నున్నది. "యుద్ధమా - భిక్షాచరణమా" - అని అడిగినప్పుడు ఏదోయొకటిని చెప్పక 'ఆధ్యాత్మ శాస్త్ర'మేల చెప్పెననగా ఆధ్యాత్మశాస్త్రమునుగూడ అర్జునుడు కోరెను. "యచ్ఛ్రేయః స్యాత్ నిశ్చితం బ్రూహి తన్మే" అని శ్రేయోపదేశమును గోరెను. "బ్రూయుః శిష్యస్య స్నిగ్ధస్య గురవో గుహ్యమప్యుత!" (భాగ) కనుక శిష్యుడగు నర్జునుడు కోరకుండేననుకొన్నను గురువు రహస్యతత్త్వమును భక్తుడగు, ప్రీతిగల శిష్యునికి తానే చెప్పవలెనను నీతి ననుసరించి శ్రీకృష్ణుడు, "శిష్యస్తేఽహం" అనిచెప్పి "శాధి మాం" అని అడుగుకొన్న, ప్రపన్నుడైన అర్జునునికి గీత నుపదేశించెను. అంతేగాక అధ్యాత్మతత్త్వజ్ఞానోపదేశము నుపసంహరించుచు "తస్మాదుత్తిష్ఠ కౌంతేయ" "యుద్ధాయ యుజ్యస్వ" అని చెప్పి ఆధ్యాత్మతత్త్వజ్ఞానము స్వధర్మాచరణ ప్రతిబంధకము కాక, స్వయోగ్యకర్మానుష్ఠానఫలమే యని నిరూపించి "యుద్ధమే" నీవు చేయవలసినదని యాజ్ఞాపించెను. కాబట్టి గీతాశాస్త్రముననే యసంగతులు, అవకతవకలును లేవు. కర్మజ్ఞానసాధనము, జ్ఞానము భగవత్ప్రసాదసాధనము - ప్రసాదము వలననే మోక్షము. కాబట్టి స్వయోగ్య వర్ణాశ్రమాచార విహిత కర్మానుష్ఠాన మొనర్చి ఫలమపేక్షింపక సుఖదుఃఖాదులవలని ఉద్రేకము ఉద్వేగముల నొందకుండ మనమును కుదుటబఱచి, హరిప్రీతికై జీవించుచు, జ్ఞానమును అపరోక్షజ్ఞానమును సంపాదించి, దానివలన ముక్తిబొంది నిరంతర సంతతానంద స్వరూపులై, పరమపురుషు సాన్నిధ్యమున నతని భజించుచు అరవిందనాభ పాదారవింద మకరందపాననిరతులై వసించు మోక్షసామ్రాజ్యప్రాప్తి సాధనంబగు శ్రీ భగవద్గీత పరమపవిత్ర గ్రంథముగదా! శ్రీ భగవద్వచనమగు గీతయందాదరములేనివారు ("సంశయాత్మా వినశ్యతి") జ్ఞానరహితులై క్లేశభాజనులగుదురు. శ్రీ గీతను నమ్మి అనగా భగవదుపదేశానుసారము యథాశక్తి, దేశకాలముల ననుసరించి కర్మానుష్ఠాన మొనర్చువారు జ్ఞానవంతులై, సుఖింతురు.

"స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్"
"ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత !"
"శ్రీ మధ్వేశార్పణమస్తు"
హరిః ఓం తత్ సత్.

# కర్మయోగి.

## రచయిత:— శ్రీ జాస్తి వెంకటనరసయ్యగారు.

[ శ్రీయుతులు జాస్తి వెంకటనరసయ్యగారు స్వయముగా కర్మయోగులు. శ్రీ భారతీ సన్మానసంఘానికి అధ్యక్షులు. ఒకానొక కవిపుంగవుని మాటల్లో "ఉజ్జ్వల మేధావి - శాంతమూర్తి - దేశభక్తుడు - తెలుగు గడ్డకు కీర్తి దెచ్చిన కవీంద్రుడు." అట్టివారు బహుళకార్య నిమగ్నులై వుండికూడా మా 'గీతావాణి'కి తమ అనుభవ క్షేత్రంలో పండించిన అమూల్య రచనను పంపి మా అభ్యర్థనను సఫలంచేశారు. వారికి మా కృతజ్ఞతలు. — సం|| ]



లోకమాన్య తిలకుపండితుడు గీతారహస్యమందు కర్మయోగ ప్రాశస్త్యమును వివరించియున్నారు. గాంధీమహాత్ముడు అహింసాపూర్వకమైన నిష్కామ కర్మయోగమును తనవ్యాఖ్యానములో విశదపరచిరి. మొదటి 6 అధ్యాయములు కర్మయోగమును, మధ్య 6 అధ్యాయములు భక్తియోగమును, చివరి 6 అధ్యాయములు జ్ఞానయోగమును నిరూపించుచున్నవని పెద్దలుచెప్పుదురు. అందు కర్మయోగము ఎక్కువమంది జనులకు అందుబాటులో నుండి స్వధర్మమును తెలుపుచుండును. "యజ్ఞ దాన తపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్" అని 18 అ.5 శ్లోకములో యజ్ఞాదిరూపకర్మలు విడవరానివని చెప్పబడినది. యజ్ఞమనగా పరోపకారమని గాంధిమహాత్ముడు నిరూపించియున్నాడు. "తే త్వఘం భుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్" అని మూడవఅధ్యాయమున స్వార్థపరత్వము పనికిరాదని చెప్పబడినది. "ముక్తసంగస్సమాచర" "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" "తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర" మున్నగు శ్లోకములలో నిష్కామముగా కర్మలు చేయుచుండవలెనని శ్రీకృష్ణులు చెప్పియున్నారు. "నియతం కురు కర్మ త్వం" అని కర్మలు విడువక చేయవలయునని ఆదేశించుచున్నారు. పరమాత్మకు సమర్పించి చేయు కర్మలన్నియు బంధనహేతువులుకావని "బ్రహ్మణ్యాధాయ కర్మాణి ........ పద్మపత్రమివాంభసా" అను 4 అ. 10 శ్లోకములో నిరూపించినారు, "గహనా కర్మణో గతిః" "సమత్వం యోగ

ఉచ్యతే” మున్నగు వాక్యములు మిక్కిలి గమనార్హములు. “సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే” అనినట్లు ఫలితమును విడచి ఆత్మశుద్ధికొఱకు కర్మలనుచేయుచుండవలయును. కర్మయోగి సాత్వికరాజసతామసకర్మలను బాగుగా తెలిసికొని సాత్విక కర్మలను ఆచరించుటకే యత్నింపవలెను.

స్థితప్రజ్ఞుడు, భక్తుడు, గుణాతీతుడు మున్నగువారందరు పొందు స్థానమునే కర్మయోగియు పొందును. మిగిలిన యోగములకంటె కర్మయోగము ఆచరణకు అందుబాటులోనుండునని చెప్పవచ్చును. కర్మయోగులైనవారే లోకకళ్యాణ కారకులగుదురుగాని, గర్వితులు, సోమరులు కాజాలరు. శాంతిని, సహనమునుపొంది పరోపకారమొనరించును.

# భగవద్గీత సందేహములు.

లేఖకుఁడు:— “కథనకళా ప్రపూర్ణ” పండిత నోముల అప్పారావు,
కాకినాడ (ఆంధ్ర.)

## గీతా వైవిధ్యము.

పరమేశ్వరుని కృపావిశేషమున ప్రస్తుతము భారతదేశమందు గీతా ప్రచారము విరివిగా జరుగుచుండుట ముదావహము. అజ్ఞానము నణంచుటలో ననుపమానశక్తి సంపన్నమగు గీతాశాస్త్రప్రచారము హెచ్చుగ జరుగుచుండుట కానందించని భారతీయుఁ డుండడనియే చెప్పవచ్చును. భగవద్గీతా శాస్త్రమువలన పొందదగు శాంతి నందఱును పొందుచున్నారా? యనునది సందేహాస్పదమైనను క్రమముగ నట్టి భాగ్యమునుబొందు నవకాశము గలదనుట నిశ్చయము. అట్టి గీతాసేవనమున పఠనమొక యంగము. పఠనమువలన సద్భావగతియు, సద్భావగతివలన సాచరణశుద్ధియు, దానివలన జీవితలక్ష్యప్రాప్తియు వరుసగ చేకూరగలవనుట విద్వద్విదితము. లక్ష్యసిద్ధికి సాధనములగు నీమూడును పవిత్రముగ నుండుటవసరమనుటనిరాక్షేపణీయము. ఈ మూడింటిలో మొదటిది గీతాపఠనము. అందు కొన్ని లోపములు కనుపడుచున్నవి. వానినిగూర్చి ప్రసంగించుకొనుట యప్రస్తుతముకాదనియు, నావశ్యకమనియు తలంచి యీ క్రిందివిషయములు గీతాభక్తులకెఱింగింపవలసివచ్చినది.

ఆంధ్రదేశమందు గీతా ప్రచారకులు, గీతాముద్రాపకులు చాలమందికలరు. వారలలో చాలమంది భగవద్గీతలను ముద్రింపించి ప్రచురించుచున్నారు. ముద్రించువారల

యశ్రద్ధవలన, ప్రూఫులుసరిగాచూడని దోషములుగాక కేవల పాఠభేదములే మిక్కుటముగ గనుపించుచున్నవి. ఒకరుప్రచురించిన ప్రతికి, యింకొకరు ప్రచురించిన ప్రతికి కొన్నిచోట్ల పాఠభేదములు హెచ్చుగా నుండుటచే పొత్తు కలియకున్నది. పాఠభేదములవలన నర్థభేదము విశేషముగలేకున్నను, గీతాపరిచయమున ప్రథమావస్థలో నున్న వారికే పాఠభేదము కొన్నిసంశయములను కలిగించవచ్చును గదా? అదియునుగాక సాముదాయికముగ గీతా పారాయణము జరుగుచోట వేర్వేరు ప్రతులలో వేర్వేరుగ నుండినయెడల యే ప్రతినిబట్టి పారాయణము జరుగవలయునో నిర్ణయించు టెట్లగును? శ్రీ వ్యాసాశ్రమమువారు, శ్రీ గీతావాణి సంపాదకులు, శ్రీ భజన సమాజమువారు, శ్రీవావిళ్ళ రామస్వామిశాస్త్రి అండ్ సన్ వారు, శ్రీరామకృష్ణ మఠమువారు, బెంగళూరు, రాజమండ్రి, బెజవాడ, తెనాలి, ఏలూరు, మైసూరు మొదలగువారు తమతమ ప్రతులు నిర్దుష్టములని నమ్ముచున్నారు. వారిననుసరించి వారి అనుయాయులు ఆపాఠముప్రకారమే చదువుకొనుచు యితర పాఠముల నాక్షేపించుకొనుచున్నారు. ఆయాక్షేపణములు క్రమక్రమముగ నీర్ష్యాసూయాక్రోధ రూపములుగ మారవచ్చును. లేదా పాఠభేదములు మనస్సున విక్షేపము నొదవించవచ్చును. పాఠభేదములను సవరించి గీతాభక్తులకు సందేహములు కలుగకుండజేయుట గీతాప్రచారకుల ప్రధానకర్తవ్యము కాదా? గీతాపఠనమున ప్రథమ ప్రవేశము గలవారలకొక పాఠము నిశ్చితము, రూఢమయినపిదప దానిని మార్పుటకష్టమగును గదా? గీతాముద్రణ మొనర్చువార లొక్కవిధముగ ప్రచురింపబూనినచో యీదోషము పరిష్కరింపబడగలదు. అనేక విద్వాంసుల నిశ్చయముననుసరించి గీతాప్రతులను చిరకాలమునుండి ముద్రించుచున్న బొంబాయి నిర్ణయసాగరప్రెస్ వారి ప్రతినిగాని, గోరఖ్ పూర్ గీతాప్రెస్ వారి ప్రతినిగాని ఆదర్శముగతీసికొని ప్రచురించిన నీవైవిధ్యము దొలగగలదు గదా? ఇతరుల నేల యనుసరించవలెను? మనకు తెలియదా యనునభిమానమును విడిచి బహుజనక్షేమము నాలోచించి గీతాప్రచారకులెల్లరు నేకాభిప్రాయమున నేకవిధముగ గీతలను ప్రచురించుటావశ్యకము. దేశవ్యాప్తమయి చిరకాలాగతమునగు నీవైవిధ్యము (పాఠభేద దోషము) మనము ప్రయత్నించిన తొలగగలదా? యను హృదయదౌర్బల్యమును వదలి ఆంధ్రదేశమందలి గీతాప్రచారకులెల్లరీ సవరణపద్ధతి ననుసరించి మహోపకార మొనర్చెదరు గాత!

గీతాప్రచారమే ప్రత్యేకకరణీయముగ వెలువడుచున్న శ్రీగీతావాణి పత్రికద్వారా తమతమ యభిప్రాయముల నెఱింగించుచు ఆంధ్రదేశమందలి విద్వాంసులు గీతాపాఠవైవిధ్యదోషములను తొలగించెదరుగాత! అచిరకాలమున ఆంధ్రభాషలో వెలువడుచున్న కొన్ని గీతాప్రతులలోగల ముఖ్యములగు పాఠభేదములను ప్రచురింపదలంచితిని. అట్టిసదుద్యమమునకు గీతాచార్యుడగు శ్రీ కృష్ణభగవానుని యనుకంప తోడ్పడుగాత! సహృదయులగు ఆంధ్రసోదరు లీసవరణపద్ధతికి బాసట యయ్యెదరుగాత.

# గీతామథనము.

అనువక్త:— బి. చిదంబరేశ్వరులు, పడకండ్ల, (ఆళ్లగడ్డ.)

గీత 4_వ అధ్యాయమున 19 వ శ్లోకమున, యెవని సమస్త ప్రయత్నములును కామసంకల్పములతోకూడ విడువబడినవో, మరియు జ్ఞానాగ్నిచే దగ్ధమైన కర్మలు కలవాడెవ్వడో, యాతడు పండితుడని యున్నది. బ్రహ్మనిష్ఠుడగు పండితునియందు, తెలిసిన శుద్ధసాత్త్విక వృత్తులగు పాండవబలమును, ఆచారములనే విశ్వసించిన తెలియని వృత్తులైన దుర్యోధన బలమును నశించును. ఇట్లు జ్ఞానాజ్ఞానవృత్తులు నశింపగా పండితు డావృత్తుల నను సరించి దుఃఖింపడు. కనుక శబ్దార్థ చంద్రిక ప్రకారము, గీతశబ్దమునకు తెలియబడినదని అర్థము చేసినాను. అన్నివిధములైన కామసంకల్పములను — ప్రయత్నములను — కర్మలను జ్ఞానాగ్నిచే దగ్ధముచేసికొన్నచో పండితుడవగుదువనియు, ఇవి దగ్ధమైనచో నేనుకూడ నశింతునని, 'అహం' శబ్దముయొక్క వాచ్యార్థముచే తానవి గ్రహించి కశ్మలమనెడి హృదయ దౌర్బల్యము నొందినచో మూర్ఖుడవగుదువనియు సూచన యీ శ్లోకమున నున్నది.

శీతోష్ణాదులను సమముగా బిచ్చివాడు చూచుకొనును. జడము లోర్చుకొనును. ఇంత మాత్రమున నెట్లు మోక్షమునకు సమర్థమగును? అనేకులు అదే నిజమని నమ్మి శీతోష్ణాదుల సహించి శరీరారోగ్యములను జెఱచుకొనుచున్నారు. ద్వంద్వములన్నియు ప్రాణాపానములకు నామాంతరములని నేను స్వయముగ వ్రాయలేదు. అశ్వమేధపర్వము ద్వితీయాశ్వాసము 48, 49_వ పద్యములందున్నది. బ్రహ్మనిష్ఠయగు సంతర్యాగమొనర్చి ప్రాణాపానములనబడు రేచకపూరకములను జయించి నిర్ద్వంద్వభావము నొందును. ఉదానాకృతియగు పరమశాంతి నొందుటచే ద్వంద్వముల సహించి సమముగా జూచుకొనవచ్చును. అనాయాసముగా మోక్షము బొందవలసిన సూక్ష్మ మిట్లుండగా తెలియక వృథాప్రయాసపడుచు శరీరారోగ్యమును జెఱచుకొనుట పొఱబాటు.

4_వ అధ్యాయమున 19_వ శ్లోకమునందలి పండితునందు కామసంకల్పములును సమారంభములును కర్మములునుజ్ఞానాగ్నిచే దగ్ధమై

నవి. ఇట్టి స్థితియగు మోక్షమును బొందుమనియే గీత అభిప్రాయము. సంకల్పము లేకపోయినచో బాహ్యయుద్ధమొనరింపలేదు. కనుక సంకల్పమును జయించుటకు అంతరంబగు కర్తవ్యమొనర్పుమని భావము. 2_వ అధ్యాయమున 50-వ శ్లోకమున యోగముకొఱకు సన్నద్ధుడవగుమని యున్నందున, గీత యోగశాస్త్రమని యున్నందున ద్వంద్వాతీతుడై చేయవలసిన యుద్ధము జ్ఞానయుద్ధము. 2_వ అధ్యాయమున 39_వ శ్లోకమున సాంఖ్యమును బోధించితినని శ్రీ కృష్ణుడు చెప్పినందునను, 2_వ అధ్యాయమునకు సాంఖ్యయోగమని విశదముగా పేరున్నందునను జ్ఞానయుద్ధమని నిరూపించితిని.



శ్రీ కృష్ణుడు అవతారమూర్తి. మనుష్యశరీరమును ధరించి మానవోచితములగు శారీరక మానసిక ఆధ్యాత్మిక ధర్మములను స్వీకరించి తదనుకూలముగ ఆయన క్రీడించినాడు. ఆతని ఆలీల యొక్క ప్రకాశమును గూఢతత్త్వమును గ్రహించినచో ఈ మహా సంసారముయొక్క లీలను దీని ఉద్దేశ్యమును తెలిసికొనగల్గుదుము. పూర్ణజ్ఞాన ప్రవర్తితమగు కర్మయే యీ మహా లీలకు ప్రధానాంగము.

శ్రీ కృష్ణుడు కర్మవీరుడు; మహాయోగి; మహా సంసారి; సామ్రాజ్యస్థాపకుడు; రాజనీతిజ్ఞుడు; యోద్ధ; క్షత్రియ శరీరమందుండు బ్రహ్మజ్ఞాని. ఆయన జీవితమందు అపారవికాసము, గంభీరచర్య మనకు గోచరింపగలదు.

— యోగిరాజ శ్రీఅరవింద.

# "భగవద్గీత"



## శ్రీ దాసు వామనరావుగారు.

★

నీతిమార్గము యేదో ధర్మమార్గము ఏదో తెలిసికొనడం సులభమైన పనికాదు. "ధర్మగతి కత్తిమొంచు నడక"వంటిది. "అటువైపున జ్ఞాతిసోదరులైన కౌరవులున్నా వారి అనుచరవర్గమున్నా కత్తులు కటారులతో నిలువబడియున్నారు. గురువులైన పూజ్యులైన భీష్మాచార్యులు, ద్రోణాచార్యులు, కృపాచార్యులు నిలువబడియున్నారు. ద్రోణాచార్యులవారే ప్రత్యక్షంగా అత్యంత శ్రద్ధాసక్తితో విలువలేని విలువిద్యలోని పలు రహస్యాలు నాకునేర్పి, గురువును మించిన శిష్యుణ్నిగా నన్ను చేశారు. అటువంటి మహామహులైన పూజ్యులగు గురువులమీదను, జ్ఞాతి సోదరుల మీదను బాణవర్షాలు కురిపించి వారి ప్రాణాలు తీయడం ధర్మమేనా? ఇది రాజనీతియేనా? లోకము మెచ్చునా? తగునా? న్యాయమగునా?" అని ఆనాటి ఆహవరంగములో అర్జునునిమనస్సు తల్లడిల్లిపోయింది. చేతిలోని ధనుర్బాణములు క్రిందపడిపోయినాయి. మనిషిని అధైర్యం ఆవేశించినది. కాళ్లు చేతులు పట్టు తప్పినట్లుగా స్తంభించి పోయినాయి. మనిషిలోనుంచి చేతనం వీడిపోయినట్లయింది. చేతిలోని అమ్ములుకూడా చేజారినవి. చేత నమ్ములు వీడ, చేతనమ్ములు వీడె నన్నట్లయింది. ఇదంతా, యీ అర్జున విషాదావస్థ అంతా, ఎందుకు ఏర్పడింది అంటే, ధర్మమార్గం ఏదో తెలియకపోవడంవల్ల ఏర్పడింది. ఆల్జిబ్రా లెక్క (బీజగణితంలోని లెక్క) ఎట్లాచెయ్యాలో పరీక్షలో తెలియక తికమకపడుతున్న విద్యార్థికి ఒళ్ళంతా చెమటలుపోసినట్లుగా అయింది. ఆల్జిబ్రా లెక్కవల్ల కలిగే గాబరాకంటె ఎక్కువగాబరా ఆగాండీవి గాబరా అని గ్రహించాలి. ధర్మమార్గం ఏదో తెలియక తికమక పడడమే మానవుని జీవితయాత్రలో ఉన్న పడిదుడుకు నడక గొడవ. అర్జున విషాదంలోకలిగిన తర్జన భర్జన ప్రతి మానవుని జీవితంలోను అంతర్గర్భితంగా ఉంటూనే ఉంది. అయితే, అర్జునుడు అనే అదృష్టశాలికి విశ్వ

(మిగత 20_వ పేజీలో)

## ఆంధ్ర కర్ణాటక భూములలో
## అద్భుత గీతాప్రచారకులు — II
# శ్రీ శంకరానందస్వాములవారు.

[ఆంధ్రభూమిలో సుప్రసిద్ధ గీతాప్రచారకుల సంగ్రహజీవితములను వ్రాసిపంపు డని రచయితలకు లోగడ విజ్ఞప్తులు చేసియుంటిమి. ఇంతకు, మాకు చేరిన శ్రీ మలయాళ స్వాములవారి జీవితమునుగూర్చిన వ్యాసమును గత పత్రికలో ప్రకటించియున్నాము. ఇంతవరకు మరెవ్వరినుండియు ఆ విషయకమగు వ్యాసములు రాలేదు; కాబట్టి, అనివార్య పక్షముతో మా శంకరానందస్వామివారి సంక్షిప్త పరిచయగాథను మేమే ప్రకటించ వలసి వచ్చినది. త్వరలో రచయితలు మాకీ రంగమున కార్యరూప సహకారమును అందించగలరని ఆశించుచున్నాము. — సం.]



గీతావాణికి సృష్టికర్త, గీతా ప్రచారమునకు యుగపురుషుడు, గీతాతత్వమునకు జీవముపోసిన విగ్రహము, గీతోపన్యాస రంగమున అతిరథ శ్రేష్ఠుడు, గీతా ప్రబోధమునకు జీవితధనమును ముడుపుగట్టిన త్యాగమూర్తి — పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శంకరానందస్వాములవారు.

శ్రీవారు కర్ణాటకదేశీయులు. శాంకరసాంప్రదాయమునకు చెందిన సన్న్యాసులు. శాంకర సిద్ధాంతమునందు వీరికి అగాధమైన భక్తి. అయినను అన్య సంప్రదాయముల నిరసించెడి స్వభావము వీరికి లేదు. కొరుకుటకు — మింగుటకు అలవి కాని గడుసైన గహన వేదాంత విషయములను అసమాన కళా కౌశలముతో అదిపి మెదిపి శ్రోతలకు కర్ణరసాయనముగ శ్రావించెడి స్వయంభూశక్తి వీరికి కలదు. వీరి ప్రవచనము పండిత పామరులకు సమ్మోహనాస్త్రము. వీరి వాగ్ధాటి వితండవేదండముల

సింహగర్జనము. వీరి ప్రజ్ఞాకౌశలము అగాధ తత్త్వవిషయములకు పాతాళభేరి. గీతయనిన తెలిపిలేని శ్రద్ధ. గీతాప్రచారమనిన యెడతెలిపిలేని పట్టుదల. శ్రీవారి ఉపన్యాస సమావేశములందు సభికులు మంత్రముగ్ధములగు సర్పములవలె కట్టు కదలరు.

శ్రీవారు కర్ణాటక హిందీ భాషలయందు అనర్గళముగ ఉపన్యసింతురు. ఆంధ్రమునందు సాధారణముగ మాటలాడగల్గినను, ఆంధ్రదేశ పర్యటనమున అనువాదకుని సహాయమును చేకూర్చుకొనియె వీరు వ్యావహారిక హిందీ భాషయందుపన్యసించెదరు.

వీరు స్థాపించిన ఆశ్రమములు ఆంధ్ర కర్ణాటక దేశములందు కలవు. తమ గురువుగారిపేరిట శ్రీ శివానందాశ్రమ మనునదొకటి మైసూరుస్టేటు కడూరుజిల్లా అజ్జంపురమునందును, శ్రీ శివానందసేవాశ్రమమనునది హాగరేకానుగిరియందును, శ్రీ గీతాసేవాశ్రమమనునది బళ్లారిజిల్లా హాస్పేట యందును, శ్రీ విద్యారణ్య విజ్ఞానసమితి యనుపేర హంపియందును ఆశ్రమములను స్థాపించియున్నారు. కర్నూలుజిల్లా ఆళ్లగడ్డయందలి శ్రీ శంకరానందాశ్రమము ఆంధ్రదేశమున ప్రధానమైనది. 'గీతావాణి' పత్రిక సుమారు నాలుగేండ్లనుండి అచ్చటినుండియె బయలుదేరి యావదాంధ్రము మూలమూలల గీతాప్రచారమును సాగించుచున్నది. కర్నూలుజిల్లా చాగలమర్రియందుకూడ శ్రీ శివరామానందాశ్రమమనుపేర నొక ఆశ్రమము కలదు.

ఆళ్లగడ్డ శ్రీ శంకరానందాశ్రమమునందు శ్రీ శంకరజయంతీ సప్తాహమును, అజ్జంపూరు శ్రీ శివానందాశ్రమములో శ్రీ గీతాజయంతీ సప్తాహమును శ్రీవారు వైభవోపేతముగ జరిపించెదరు. ప్రతిసంవత్సరమును హంపిక్షేత్రమునందు శ్రీవారి ఆధ్వర్యమున గీతాపురశ్చరణ యజ్ఞము విజృంభణముగ జరుగుచున్నది.

శ్రీవారి గీతాప్రచారోద్యమము యింతవరకు రాయలసీమవరకే పరిమితమై యుండినది. గత రెండుసంవత్సరములనుండి, నెల్లూరు కృష్ణాజిల్లాలకును తెలంగాణమునకును సాగినది. హిందూదేవ ధర్మాదాయ కమీషనరుగారును, డిప్టీ

కమీషనర్ గారును కోస్తా జిల్లా లంతటను పూర్తిగ పర్యటనము చేసి గీతాప్రచార మొనర్చవలెనని శ్రీ స్వామివారిని కోరియున్నారు. కోరిక నంగీకరించి, ప్రభుత్వమువారి యేర్పాట్లతో యీ సంవత్సరము బందరుపట్టణమున శ్రీవారు గీతోపన్యాసములను జరిపినారు. శ్రీ రామకృష్ణానందస్వామివారి సహితము గ శ్రీ శంకరానందస్వాములవారి గీతాప్రచార పర్యటనములు యికమీదట ప్రతియేటా సర్కారు జిల్లాలయందు క్రమముగ జరుగగలవు. ఉత్తరాంధ్రులీ అవకాశమును సద్వినియోగము చేసికొందురు గాక!

హరిః ఓం తత్ సత్

(17-వ పేజీ శేషము)

రూపం చూపించి, "ధర్మమార్గం ఇదిగో!" అని చూపిన శ్రీకృష్ణ పరమాత్ముడు లభించాడు. 'తారక మంత్రము కోరిన దొరకెను, ధన్యుడ నైతినిగా" అని అర్జునుడు ఆ సమర రంగంలో అప్రతిమ ప్రతాపుడై, సమరనిశ్శంకుడై ధర్మ ప్రతిష్ఠాపనార్థం ధ్వజమెత్తి విజయుడైనాడు. భారతయుద్ధం అంటే 'ధర్మవిజయం' అని నిరూపించాడు. ఆనాటి మహా "జయం" అంటేనే "మహాభారతం" అని అన్వయించింది లోకం. మహాభారతయుద్ధం మూలంగా మనకు లభించింది ఏమిటంటే అర్జునునకు శ్రీకృష్ణుడు బోధించిన "భగవద్గీత" అనబడే ధర్మోపదేశం.

[ ఆంధ్రపత్రిక (సచిత్ర వారపత్రిక 26-5-54) నుండి కృతజ్ఞతతో ]

## వార్తలు.

శ్రావణ బ ౧౩ లు (26-8-54) గురువారం శ్రీ గండిక్షేత్రం - భూమానందాశ్రమమునందు సద్గురు సాధు రామయ్యగారి పంచదశ వార్షికారాధనము ఆనందముగ జరిగినది. శ్రీశ్రీశ్రీ భూమానందస్వాములవారు తమ దివ్యోపన్యాసములతో కార్యక్రమమును మహా వైభవముగ నొనర్చినారు.

హంపిక్షేత్రమునందు 10-8-54 నుండి జరుగవలసిన శ్రీ గీతాపురశ్చరణము కారణాంతరములతో 24-8-54 నుండి ఆరంభమైనది.

# యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి.

రచన: స్వామి శ్రీశివానందసరస్వతి    అనువాదం: R. రాధాకృష్ణయ్య.



ఏదైననొక (భగవన్నామ) మంత్ర పురశ్చరణము జపము. ఇక్కలియుగమున దైవసాక్షాత్కార మునకు జపమొక సులభమైన మార్గము. తుకారామ్, ప్రహ్లాదుఁడు, వాల్మీకి, ధ్రువుఁడు, మఱిపెక్కురు కేవలము జపమువలననే సాయుజ్యమును పడసిరి. "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి— యజ్ఞములందు నేను జపయజ్ఞము" అని గీతయందు శ్రీకృష్ణుఁడు ప్రవచించెను.

జపము త్రివిధము. (1) నోటఁ జెప్పెడి (బిగ్గరయైన) జపము (వైఖరి.) (2) మధ్యమ స్వరమున నోటఁజెప్పెడి జపము (ఉపాంశు) (3) మనస్సుచే మానపురశ్చరణము (మానసికజపము). మానసికజపము అధికతర శక్తిగలది. అది బిగ్గరయైన జపముకంటెపదిశసహస్రపర్యాయము లధికమైన ఫలితము నొసంగును. ఏ యుద్దేశములేకుండ మనస్సు తిరుగాడునపుడు బిగ్గరయైన జపమునకు పూనుకొనుము.

జపమునియతమైనది కావలెను. సాత్త్విక భావముతో, దైవభావముతో, పవిత్రతతో, భక్తిశ్రద్ధలతో జపమొనరింప వలయును. దైవనామము (మంత్రము) నందు వర్ణింప శక్యముగాని యొక అచింత్యశక్తిగలదు. ఒక్కొక్క మంత్రము అసంఖ్యేయ శక్తులతో నిర్భరితమై యున్నది. గుడ్డయొక్క మురికిని సబ్బు శుభ్రపఱచుపగిది, జపాభ్యాసము మనోమాలిన్యములను నిర్మూలించును. నీ జపమున సక్రమముగ నుండుము. జపము పాపములను నాశముగావించి, పరమేశ్వరునితో భక్తుని ముఖాముఖిగ తెచ్చును.

దోషరహితముగనైనను, దోషసహితముగనైనను, తెలిసియైనను, తెలియకయైనను, జాగ్రత్తగనైనను అజాగ్రత్తగనైనను, భావయుక్తముగనైనను, భావరహితముగనైనను ఆచరింపఁబడిన భగవన్నామ జపము వాంఛితఫలము నొసఁగుట తథ్యము. కొంతకాలము తరువాత భావము దానంతట అదే కలుగును.

తెవు 4 గంటలకు మేల్కొని, రెండు గంటలసేపు జపముచేయుము. నీవు ముమ్మరపు ప్రయోజనములను పడ

యుదువు. ఊహానముచేతను, బుద్ధి చేతను పరమేశ్వరనామ ప్రభావము ను స్థిరపఱుపలేము. భక్తి, విశ్వాస నిరంతర నామపురశ్చరణములవలన మాత్రమే దానిని నిక్కముగ అను భవింపవచ్చును, తెలియవచ్చును. పరమేశ్వర నామమునెడ గౌరవ విశ్వాసముల నుంచుము. వాదింప కుము.

శ్రీ మహావిష్ణుభక్తులు "హరిః ఓం" లేక, "ఓం నమో నారాయ ణాయ" అను మంత్రములను పుర శ్చరణ నొనరింపవచ్చును. శ్రీరామ భక్తులు "శ్రీరామ" లేక "సీతా రామ" లేక "ఓం శ్రీరాం జయరాం జయజయ రామ్" అని పురశ్చరణ చేయవచ్చును. శ్రీ కృష్ణభక్తులు 'ఓం నమోభగవతే వాసుదేవాయ' అని పురశ్చరణము సలుపవచ్చును. శ్రీ మహాశివుని భక్తులు "ఓం నమఃశివాయ" అని పురశ్చరణ గావింపవచ్చును. అనుదినము 200 మాలల జపమాచరింపుము. నీ కం ఠమున నొకజపమాలను ధరింపుము. భగవానుని చెంతకు మనస్సును తరుముటకు మాల యొక కొరడా వంటిది.

హే మర్త్య! నామమునందు ఆశ్రయము గొనుము. నామము, నామి—ఇవి వీడనివి. ఇక్కలియుగ మున భగవంతుని చేరుటకును అమృతత్వ, నిత్యశాంతులను పడ యుటకును జపము సులభతమమైన, వేగతమమైన, భద్రతమమైన, నిశ్చ యతమమైన మార్గము. జయతు భగవాన్! జయతు శ్రీ భగవ న్నామ!!



# పాండవపక్ష వీరుల సంగ్రహ చరిత్ర.

రచన: వంగీపురం రంగస్వామి అయ్యంగారు,

పాకాల, చిత్తూరుజిల్లా.

1. యుయుధానుఁడు. ఇతఁడే సాత్యకి, అర్జునుని శిష్యుఁడు, కృష్ణభక్తుఁడు, అతిరథుఁడు. అనగా అసహాయుఁడై యెందరితోనైనను యుద్ధము చేయగలవాఁడు. భారత యుద్ధములో మరణింపక యాదవక్షయమున మరణించెను.

2. విరాటరాజు. ఇతఁడు మత్స్యదేశము నేలిన సకల సద్గుణ గరిష్ఠుండగు రాజు. ఇతని ఆదరముననే పాండవు లజ్ఞాతవాసము గడపిరి. ఇతని పుత్రికయగు ఉత్తర యర్జునుని కుమారుఁడగు అభిమన్యుని భార్య. విరటుఁడును, ఉత్తరుఁడు శ్వేతుఁడు శంఖుఁడు అను నితని ముగ్గురు కుమారులును భారత యుద్ధములో మడిసిరి.

3. ద్రుపదుఁడు. ఇతఁడు పాంచాలరాజగు పృషతుని పుత్రుఁడు. పృషతుఁడును భరద్వాజఋషియు స్నేహితులు. బాల్యమున ద్రుపదుఁడు కొంతకాలము భరద్వాజాశ్రమమున వసించునపుడు భరద్వాజముని కుమారుఁడగు ద్రోణునితో మైత్రి కుదిరెను. ద్రుపదుఁడు రాజు కాగా ద్రోణుఁడొక్క పర్యాయము ద్రుపదుని చెంతకరిగి 'మిత్రమా!' యని సంబోధించెను. అంత ద్రుపదుఁ డలుగగా ద్రోణుఁడు చింతతో మరలివచ్చెను. పాండవులకును కౌరవులకును విలువిద్య నేర్పి గురుదక్షిణకు మారుగా ద్రుపదుని రోధింపవలెనని అర్జునున కాజ్ఞాపింప నతఁడట్లు చేసె. అప్పుడు ద్రుపదుఁడు ద్రోణాచార్యులతో సఖ్యము చేసికొని పైకిమాత్రము మైత్రిపాటించుచు మనసులో వైరము పూనియుండెను. యాజుఁడు, ఉపయాజుఁడు అను మునుల సాయమున ద్రోణాచార్యుల వధింపంగల కుమారుని పడయునిమిత్తమొక యజ్ఞము గావించెను. హోమాగ్నినుండి ధృష్టద్యుమ్నుఁడును, కృష్ణయను కన్యకయు నుద్భవించిరి. ఈకన్యక ద్రౌపదియని పిలువంబడెను. ఆమెకే యాజ్ఞసేనియను నామాంతరము గలదు. ఆమెను విలువిద్యాపారంగతుఁడగు అర్జునుఁడు మత్స్య యంత్రము గొట్టి పొందగా తలవనితలంపుగా కుంతీదేవి వాక్కు ననుసరించి ద్రౌపది పాండవులేవురకు పత్ని యయ్యెను.

4. ధృష్టకేతుఁడు. చేదిరాజగు శిశుపాలుని కుమారుఁడు. భారత యుద్ధమున ద్రోణాచార్యులచే జంపఁబడెను.

5. చేకితానుఁడు. ఇతఁడు యాదవులలో వృష్ణులను శాఖవారిలో నొక వీరాగ్రేసరుని పుత్రుఁడు. ఇతఁడు మహారథుఁడు. పాండవసేనలో నొక యక్షౌహిణికి నాయకుఁడు. ఇతఁడు దుర్యోధనునివలనఁ గూలెను.

6. కాశిరాజు. ఇతఁడు మహాశూరుడు, మహారథుఁడు. ఇతని పేరు క్రోధహంతా.

7. పురుజిత్తు, 8. కుంతిభోజుడు. వీరిరువురు కుంతీదేవి సోదరులు. పాండవుల మేనమామలు. ఇరువురు ద్రోణాచార్యులచేఁ జచ్చిరి.

9. శైబ్యుఁడు. ధర్మరాజుయొక్క మామగారు. ఇతని పుత్రికయగు 'దేవిక'ను యుధిష్ఠిరునకిచ్చిరి. ఇతఁడు మహాశూరుడగుటయేగాక సకల సద్గుణముల కాటపట్టు. పురుషులలో శ్రేష్ఠుడనంబడెను.

10. యుధామన్యువు, 11. ఉత్తమౌజుఁడు. వీరు పాంచాలదేశ రాజపుత్రులు, సోదరులు. వీరు అర్జునుని రథచక్రములను రక్షింప నియోగింపఁబడిరి. మహాబలపరాక్రమో పేతులు. వీరు నిద్రించుచుండగా అశ్వత్థామ వీరిని చంపెను.

12. అభిమన్యువు. ఇతఁడు కృష్ణుని సోదరియు, అర్జునుని భార్యయునగు సుభద్ర కుమారుడు. ఇతఁడు విరాటరాజు కూతురగు ఉత్తరను వివాహమాడెను. ఇతఁడు తండ్రి వద్ద విలువిద్య నేర్చుకొని యద్వితీయ నైపుణ్యము పొందెను. యుద్ధములో నొకనాఁడు ద్రోణాచార్యులు పన్నిన చక్రవ్యూహములో యుధిష్ఠిరుఁడు, భీముఁడు, నకులుఁడు, సహదేవుఁడు ప్రవేశింపలేకపోయిరి. అర్జునుఁడు వేరొకచోట యుద్ధము చేయుచుండగా అభిమన్యుఁడా వ్యూహములోఁ బ్రవేశించి యనేకులను వధించుచుండగా అక్రమముగా ద్రోణుఁడు, కృపాచార్యుఁడు, కర్ణుఁడు, అశ్వత్థామ, బృహద్బలుడు, కృతవర్మయను మహారథులు అభిమన్యుని చుట్టుకొనిరి. దుశ్శాసనుని పుత్రుని గదాఘాతముచే నితఁడు మరణించెను. ఇతని కుమారుఁడే పరీక్షితు మహారాజు.

13. 14. 15. 16. 17. ప్రతివింధ్యుఁడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుఁడు, శ్రుతసేనుఁడు. వీరైదుగురు ద్రౌపదీ పుత్రులు. పాండవులైదుగురివలన వరుసగా పుట్టిన వారు. మహారథులు. వీరు మధ్యరాత్రమున అశ్వత్థామచేఁ జంపఁబడిరి.

వీరేగాక ఇతరులనేకులు అతిరథులు, మహారథులు పాండవసేనలో నుండిరి.

గీతలోని ఎగ్గుర్తు.

అందరి మేలుతోపాటు తన మేలును సాధించు మార్గాన్ని ధర్మ్యమంటారు.



## 1. శ్రీ శంకరగ్రంథ రత్నావళి — ప్రథమ సంపుటము.

అనువాదకులు:— శ్రీ నిర్వికల్పానందస్వామివారు.

ప్రకాశకులు:— సాధనగ్రంథమండలి, తెనాలి.

సుమారు 300 పేజీలు వెల 3—0—0 పోస్టుఖర్చులు 0—12—0

శ్రీ జగద్గురు ఆదిశంకరులవారి సమగ్రవాఙ్మయమును తెలుగు అనువాద సహితము మొత్తము 25 సంపుటములుగ ప్రకటింపబూనిన శ్రీ సాధనగ్రంథమండలివారి ప్రయత్నమున నిది ప్రథమ సంపుటము. ఇందు నూరు శ్లోకములకు మించని ఉపదేశ ప్రకరణములు నలుబది ఆంధ్ర భాషాంతరీకరణ సహితముగ అకారాదిక్రమము ననుసరించి చేర్చబడినవి. తెలుగువచన రచనయందు సిద్ధహస్తుడగు శ్రీ నిర్వికల్పానందస్వామివారు అనువదించినారు. ముఖచిత్రము, శిష్యచతుష్టయ సహితమగు శ్రీ శంకరులవారిది. గ్రంథారంభమున ఏకవర్ణ చిత్రము శ్రీ శంకరులవారిది కలదు.

శ్రీ శాంకర వాఙ్మయమును సమగ్రముగ నాగరిలిపియందు శ్రీరంగము వాణీ విలాస ముద్రాక్షరశాలవారు ప్రకటించియున్నారు. కాని అది మూలము మాత్రము. భాష్యములును - ఉపదేశ సాహస్రియు తప్ప, తక్కిన గ్రంథరాశి నంతటిని సానువాదముగ కలకత్తా వసుమతీ కార్యాలయమువారు వంగలిపియందు వెలువరించియున్నారు. హొళె నరసీపురము అధ్యాత్మ ప్రకాశ కార్యాలయమువారి పక్షమున జయచామ రాజేంద్ర గ్రంథరత్నమాలయను పేరిట కన్నడ లిపియందు అనువాదయుక్తముగ శాంకర వాఙ్మయమును పూర్తిగ వెలువరించు ప్రయత్నము జరుగుచున్నది. అది యింకను పూర్తి కాలేదు. అహమదాబాదు సస్తుం సాహిత్యవర్ధక కార్యాలయమువారు గుజరాతీ భాషయందు యీ ఉద్యమమును కొంత సాగించియున్నారు. ఇంకను విడివిడిగ ఎన్నో సంస్కరణములు బయల్వెడలినవి. ఇంతకూ సానువాద శాంకర వాఙ్మయమును సమగ్రముగ ఏ ఒక్క కార్యాలయమువారుకూడ ప్రచురించియుండలేదు. అంతటి విరాట్ ప్రయత్నమును తలపెట్టిన శ్రీ సాధన గ్రంథమండలివారికి ఆంధ్ర సోదరులు తమ ఆదరాభిమానములను కార్యరూపమున చూపవలసియున్నది. ప్రకాశకులు చెప్పినట్లు యిది మహాసేతు నిర్మాణము. ఈ ఉద్యమమునందు ఆంధ్రభూమిలోని ప్రతిచిన్ని ఉడుతసైతము

పాల్గొనవలసి యుండును. వేదాంతవేద్యుడు — పురాణపురుషోత్తముడు — భగవంతుడు వీరి కృషిని విజయోపేత మొనర్చుగాక!

లోకమాన్యమగు యిట్టి గ్రంథములను రాజ సంస్కరణములుగ వెలువరించుట శోభావహము. అంతరంగ సౌందర్యమునకు తగినట్లు బహిరంగ సౌందర్యముకూడ కలిసివచ్చినచో ఎంతో ముచ్చటగ నుండెడిది. ఆర్థిక దుఃస్థితివలన ప్రకాశకులు సామాన్యమగు కూర్పు తీర్పులతో వెలువరించినారు. గ్రంథము పెరిగిపోవునను భయముతో అనువాదకులు తమ భావను కుదించి సూత్రప్రాయ మొనర్చినారు.

తెలుగువారివద్ద ధనము లేకపోలేదు. కాని అది సద్వినియోగమయ్యెడి అదృష్టము లేదేమో! కొల్లోకొల్లలుగ వెల్లివిరిసిన దుర్గంధసాహిత్యముతో, అవనతికి — అధోగతికి దిగజారిన ప్రజాకోటియొక్క నైతిక స్తరమును తిరిగి ఉన్నతోన్నతము చేయవలెనన్న సత్సాహిత్యముయొక్క బహుళప్రచారము కావలసియున్నది. పవిత్రమైన ధనదేవతను దుర్గంధభోగములకు బలిచేయక, సుగంధ సాహిత్య సర్వతోముఖ వికాసమునకు వినియోగించి, జ్ఞానదాతలనెడి యశస్సును సంపాదింపుడని ఆంధ్రజనులకు విన్నవించుచున్నాము.

## 2. రత్నమాల:—

కవి — కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు.

దొరకుచోటు:— కోగంటి అన్నపూర్ణమ్మగారు, పామర్రు P. O. కృష్ణాజిల్లా.

వెల. 0—8—0

విభిన్న విషయములపై వ్రాయబడిన పద్యముల సంపుటీకరణ మీ గ్రంథము. వేమనవలె సరళమైన అలతిపదములతో కవిత గూర్పగల నేర్పు యీ కవిగారికి కలదనిన ప్రాజ్ఞ జనాభిప్రాయ మెంతయు నిజము.

## 3. శ్రీమద్రామాయణ సంగ్రహము:—

రచయిత:— సూరి వెంకటసుబ్బారావుగారు.

ప్రకాశకులు:— ఉమా, పబ్లికేషన్స్, ఉయ్యూరు పోస్టు, కృష్ణజిల్లా.

వెల. 1—4—0



# గీతనెట్లు జదువవలెను?

కాశీ పాండురంగశర్మ — జడ్చర్ల, నైజాం.

శ్రీమద్భగవద్గీత అష్టాదశాధ్యాయములతోను, ఏకోత్తర సప్తశతిశ్లోకములతోను*విరాజిల్లుచున్న అనన్యసదృశంబగు సద్గ్రంథము. ఇందలి భాష సుదీర్ఘ సమాసములతోగూడి కేవలము పండిత ప్రకాండులకు మాత్రమే యర్థమగునట్లుగాక సరళమై, సుగ్రాహ్యమై, హృద్యమై, సుమనోహరమై, నిగూఢభావాంతర్గతమై ఎన్ని మారులు జదివినను క్రొంగ్రొత్త భావములను అర్థములను, వెదజల్లుచు చదువరులకు నిరుత్సాహమును గలిగింపక నిత్యనూతనముగ నున్నట్లుండును. శ్రీమద్భగవద్గీత రఘువంశ కుమారసంభవములవంటి యొకసామాన్య కావ్యముగాదు. ఇదియొక మహాకావ్యము. ఏలన రఘువంశ కుమారసంభవాదులకు కొన్ని భాష్యములులేక వ్యాఖ్యానములు మాత్రమేగలవు. భగవద్గీతకన్ననో శ్రీ అరవిందయోగులు సెలవిచ్చినట్లు — గీతపై వేలకొలది వ్యాఖ్యానములున్నను ఇక నూతన వ్యాఖ్యలవలన ప్రయోజనముండజాలదను కాలము ఎన్నడు రాజాలదు. ఎట్టి జగదేక పండితుడైనను గీతనుతాను హృదయంగమము జేసుకొంటిననియు, యిక గీతపై వ్యాఖ్యానము చేయుట వ్యర్థమనియు చెప్పదగిన వ్యాఖ్య నెవ్వరును వ్రాయజాలరు. రఘువంశ కుమారసంభవాది కావ్యములు సాహిత్య శాస్త్రజ్ఞుల మోహింపజేసి సాహిత్య చరితమునందుత్కృష్టగ్రంథములుగ పేర్కొనబడుచున్నవి. భగవద్గీత యట్లుగాక వేదాంతుల, యోగుల, రసికుల, పండితుల, పామరుల, దేశస్థుల, విదేశస్థుల, ఖండాంతరస్థుల నెల్లర మోహింపజేయుచు విశ్వసాహిత్యమునందత్యంత మహోత్కృష్టస్థానమునలంకరించుచున్నది. ఇట్లుండుట వలననేగదా యుగములు వ్యతీతములైనప్పటికిని, సహస్రాధిక వర్షములు గడచినప్పటికిని, ప్రపంచసాహిత్యమునందు మూర్ధన్యస్థానమునందుకొనినదై నేటికిని లోకులచే ననన్యానముగ నాదరింపబడుచు

* శ్రీ భగవద్గీత ఏడువందల శ్లోకములు కలదియని శ్రీ శంకరుల అభిప్రాయం. — సం.॥

న్నది. అహో! యిట్టిమహోత్కృష్ట సాహిత్యమును సృష్టించి లోకమునకు మహోపకారమును గావించిన యా కవిబ్రహ్మయగు పరాశరాత్మజునకు స్వస్తియగునుగాక !

అష్టాదశాధ్యాయములచే శోభాయమానమగుచున్న శ్రీమద్భగవద్గీతయొక్క ప్రతిఅధ్యాయముచివఱ "ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే" యని కలదు. దీనివలన నియ్యది యుపనిషత్సారముగను, బ్రహ్మవిద్యలలోకెల్ల బ్రహ్మవిద్యగను, యోగశాస్త్రములలోకెల్ల యోగశాస్త్రముగను విలసిల్లుచున్నదని స్ఫుటమగుచున్నది. కావున భగవద్గీతను జదివిన సజ్జనుడు అష్టాశదముత్తరోపనిషత్తుల యోగశాస్త్రములన్నెల్ల వల్లెవేయ బనిలేదు. ఈ కారణమువలననే "గీతా సుగీతా కర్తవ్యా, కిమన్యైః శాస్త్రవిస్తరైః? — అనగా గీతను బాగుగ జదువవలెను. వేరేశాస్త్రములతో బనియేల" అని చెప్పబడినది. ఇట్లుదీని మహాత్మ్యమునుగుఱించి చెప్పుటచేతనే గాబోలును భగవద్గీత 'ఇందుగలదందు లేదని సందేహమువలదు, ఎందెందు వెదకిచూచిన నందందె గలదా'ను నట్లు నాగరికతనందిన ప్రతియింటను విరాజిల్లుచు ప్రతి మనుజునిచేతను పఠింపబడుచున్నది.

విశ్వవేదికపై నిలిచి — "భగవద్గీతను కొన్ని గంటలలోపలనే చదువవచ్చును. దాని నర్థముజేసికొనుటకు అనేక జన్మములుగావలెను. భగవానుడర్జునునకు బోధించినవి మాటలుగావు జ్ఞానకళికలు. జీవితాదర్శమంతయు నొక్కక్షణములో తెలుపబడెను. ఆకాశమును మెఱుపుతీగ వెలిగించునట్లు అజ్ఞానజ్యోతి అర్జునుని హృదయ ఫలకమును ప్రకాశింపజేసెను. అప్పుడర్జునుడు యుద్ధరంగమున దుమికెను. యుద్ధముజేసెను. శత్రువుల జంపెను. జయించెను. అయినను తాను యుద్ధముజేయలేదనియు, తాను చంపినవాడుగాని, జయించినవాడుగాని కాదనియు అనుభవములో గ్రహించెను." అని యుద్ఘోషించిన శ్రీ స్వామి వివేకానందుని మాటలయందెంతో సత్యమిమిడి యున్నది. నిజముగా భగవద్గీత నర్థముజేసుకొని "కనుగొంటిని, శ్రీరామునినేగనుగొంటిని" అని భక్తరాజగు త్యాగరాజ గానము జేసినట్లుల "కనుగొంటిని, గీతార్థమునునే గనుగొంటిని, పరిపూర్తిగ గనుగొంటిని" అనిపలికిన మహానుభావులులేరు, ఉండబోరుగూడ! గీత

యందలి ప్రతిశ్లోకము, ప్రతిశ్లోకా ర్థము, ప్రతియక్షరము భగవానునిచే స్వానుభవ పూర్వకముగ జెప్పబడి నది. అట్లు జెప్పినదేగదా యెవని పలుకులైనను చిరకాలము ధృవ తారవలె నిలమని యుండగలవు. ఈనాటికిభగవద్గీతను సంపూర్ణముగ నర్థముజేసికొని, 'తు, చ' తప్పక యనుభూతిని బడసినది పార్థుడొక్క డే! మనము భగవద్గీతను సంపూర్ణ ముగ నర్థము జేసికొనక పోయినను, దానియందలి కొంతభాగమునైన అర్థముజేసికొని, అనుభవమునందు టకు అపరపార్థులముగావలెను. లేక ధనంజయ సదృశులము గావలెను. అంతవఱకు "నేను భగవద్గీతను ఒక్క గంటలోనే జదివి పారవేయ గలను, కావున గీతనిటు దెండు. నేను జదువుచుందును, మీరు భజనజేయుచుండు"డని సప్తాహాది పుణ్యకార్యములందు ప్రగల్భములు గొట్టుటయును "వానికి సరియైన యుచ్చారణ రాదు. గీతను సక్రమో చ్చారణతో జదువనియెడల మహా పాతకములు సంభవించును గాన నాకిండు; నేను జదువుదు"నని ప్రలపించుటయును, "నేను యిఱు వదియైదున్న మూడు యిఱువది యెనిమిది సంవత్సరములనుండి గీతా పారాయణము జేయుచున్నాను. ఈనాటికి ఐదువందల పై చిల్లర పారాయణములు జరిగిన"వనిపారా యణపు లెక్కను పదిమంది సమక్ష మునబెట్టి డంబములు గొట్టుట యును నిష్ప్రయోజనములే! పారా యణముజేయుటయన నిట్లుగాదు. 'పారమయ న్తే, గచ్ఛన్త్యనేనేతి పారాయణమ్' అనగా 'దీని చేత దరినిజేరుదురు' అని పారాయణ మునకు వ్యుత్పత్త్యర్థము. భగవ ద్గీత అట్టి పారాయణగ్రన్థము. దీని చేత దుస్తర సంసార సాగరపు యావలి దరిని జేరవచ్చుననగా మోక్షమును బొందవచ్చును. ఎట్లొక దుర్బలుడగు యువకుడు 'యోగాసనములు — వ్యాయా మము' అను పుస్తకమునుదెచ్చి పదేపదే జదివి బలమును సంపా దించలేడో అట్లే ఈ భగవద్గీతను గూడ మాటిమాటికి చదువుటవలన

అమూల్యమగు సమయమును వ్యర్థపుచ్చుకొనుటదప్ప మఱెట్టి ప్రయోజనమును లేదు. ఆ యువకు డాపుస్తకమును జదివి యందెట్లు నిర్దేశించ బడినదో యట్లనుష్ఠించినగాని అతనికి బలము సమకూరదు. అట్లే భగవద్గీతను జదివి యందు భగవానుడెట్లు జేయుమని నిర్దేశించెనో యట్లు అనుష్ఠించినగాని దానివలన, దానిని జదువుటవలన ప్రయోజనముండదు. అప్పుడుగాని అది పారాయణ మనిపించుకొనదు. శమితి.

"స నో బుద్ధ్యా శుద్ధ్యా సంయునక్తు"

## గీతావాణి – పోషక వర్గము.

### మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు – 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥ – 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. – 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. – 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. – 6. శ్రీ పగిడేల లక్ష్మినారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ – 7. శ్రీ తొమ్మండ్ర రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాగలమర్రి. – 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, సై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. – 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. – 10 శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, ఎర్రగుంట్లపోస్టు. – 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. – 12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు. – 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు. – 17. శ్రీ యస్. రామలింగంపిళ్లైగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్ఘనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. – 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్ పేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. — 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్ — 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెరె. — 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా.— 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. — 30. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ — 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

32 గ్రంథి నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లైవీధి, మద్రాసు.

తూర్పుగోదావరి జిల్లా:— 33. శ్రీ సమయమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా:— 34. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులుగారు, పాలకొల్లు. 35. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ — భర్త శ్రీ సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

కృష్ణాజిల్లా:— 35. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. — 36. శ్రీభట్టిప్రోలు సత్యనారాయణరావుగారు. సర్కిల్ పేట, బందరు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్పరాజుగారు, గోనపాడు. — 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. — 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. — 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. — 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. — 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. — 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. — 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. — 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. — 10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. — 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. — 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. — 13. శ్రీ పాణ్యాం

రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. — 14. శ్రీ పాణ్యం రామనాథశాస్త్రిగారు, — కోయిలకుంట్ల. — 15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యం. — 16 శ్రీ శాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరుగ్రామం, యర్రగుంట్ల పోస్టు.

కడపజిల్లా. 17. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ 18. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దుటూరు. — 19. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. — 20. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. — 21. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్య శ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 22. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 23. శ్రీ క. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 24. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 25. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ. పెరియంబాడి. — 26. శ్రీ నటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 27. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 28. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. — 29. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు రాగలపాడు. — 30. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. — 31. శ్రీ క. చౌడయగారు, జమీందార్, మిణకనగుర్కి. — 32. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరుతా॥ — 33. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 34. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 35. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. — 36. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. — 37. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. — 38. శ్రీ సాధు శివలింగప్ప గారు, కుందనగుర్తి. — 39. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి — 40. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 41. శ్రీ శాకల అంజనేయులుగారు, కుందనగుర్తి. — 42. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.

నెల్లూరు జిల్లా: 43. శ్రీ బ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 44. శ్రీ శంకరనాయుడుగారు, కార్యూరు.

మైసూర్ స్టేట్: 45. శ్రీ కాశబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 46. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. — 47. శ్రీ క. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 48. శ్రీ క. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. 49. — శ్రీ నారాయణమూర్తిగారు, c/o నూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. కోలారు. — 50. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

## గీతావాణి — పోషకవర్గము.

హైదరాబాదు స్టేట్: 51. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. — 52. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. — 53. నాగబండి విశ్వనాథం గారు, 12/88 మైక్రారోడ్డు, వరంగల్. — 54. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి, 12/285 గిర్మాజిపేట, వరంగల్ — 55. శ్రీ గండె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణదుకాణం, వరంగల్ — 56. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు కిరాణదుకాణం, వరంగల్ — 57. శ్రీ తాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్ — 58. శ్రీ పుల్గాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ — 59. శ్రీ మహారు బసవలింగంగారు, వరంగల్ — 60. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్ — 61. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ — 62. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు వరంగల్ — 63. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, కిరాణం మర్చంట్, వరంగల్ — 64 శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్. — 65. శ్రీమతి కామేశ్వరమ్మ గారు c/o రవ్వా కైలాసంగారు, బట్టలదుకాణం, వరంగల్ — 66. శ్రీ సోమా నరసయ్య గారు, వరంగల్ — 67. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ — 68. శ్రీ చండా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్ — 69. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు వరంగల్ — 70. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

కోయంబత్తూరు జిల్లా: 71. సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొళ్లేగాలం.

కృష్ణాజిల్లా:— 72. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడ్పుగల్లు. 73. శ్రీ బావినేని రామకోటయ్యచౌదరి, పరమాత్మానందాశ్రమము, గీతాభవనము, పెనమలూరు. — 74. శ్రీ అమారి చలపతిరావుగారు. రుస్తుంబాద్, బందరు. — 75. శ్రీ మోటుమఱ్ఱి దయానిధిగారు, బందరు.

తూర్పుగోదావరిజిల్లా:— 76. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి. — 77. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. — 78. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి. — 79. శ్రీ మాధంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 80. శ్రీ మాతంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి.

పశ్చిమగోదావరి జిల్లా:— 81. శ్రీ ఆబోతుల రామన్నగారు, పాలకొల్లు. — 82. శ్రీ మామిడి సత్యనారాయణగారు, పాలకొల్లు.

### అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు-16.
2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla.
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# రచయితలకు విజ్ఞప్తి.

గీతా ప్రచారకులగు కొందరు మహనీయుల పేర్లను క్రింద సూచించియున్నాము. ఇందులో తమకు తెలిసినవారి జీవితవృత్తాంతములను – వారి గీతాప్రచార ఉద్యమాంశము లను వ్రాసిపంపవలెనని అర్థించుచున్నాము.

1. శ్రీ శ్రీ శ్రీ చిద్ఘనానందేంద్రసరస్వతీస్వాములవారు (శ్రీ కోరంకి వెంకటరామశర్మగారు)
2. శ్రీ శ్రీ శ్రీ బోధానంద మహర్షులవారు
3. శ్రీ విన్నకోట వెంకటరత్నశర్మగారు
4. శ్రీ శ్రీ శ్రీ సత్యానందస్వాములవారు
5. శ్రీ శ్రీ శ్రీ నిత్యానందస్వాములవారు
6. శ్రీ శ్రీ శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు
7. శ్రీ శ్రీ శ్రీ శాంతానందస్వాములవారు
8. శ్రీ శ్రీ శ్రీ సీతారామయతీంద్రులవారు
9. శ్రీ నోముల అప్పారావుగారు
10. శ్రీ మాకం తిమ్మయ్యశ్రేష్ఠిగారు
11. శ్రీ సాధు అమ్మగారు, రాజమహేంద్రవరం
12. శ్రీ గౌడు జోగమాంబగారు
13. శ్రీ లంకా భాగీరథమ్మగారు.

---

శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు, సెప్టెంబరు 1954 కా.1000.